# శ్రీమద్రామానుజాచార్యులు ఆంధ్రులు

కొంతకాలముక్రిందట శ్రీవిశిష్టాద్వైత మత ప్రచారక సంఘ ద్వితీయమహాసభ జరిగెను. దాని కధ్యక్షతవహించిన శ్రీ ఉ-వే- గొట్టుముక్కల రమాకాంతాచార్యులు బి-ఏ-గారు తమఉపన్యాసపందర్భములో శ్రీమద్రామానుజాచార్యులవారు ఆంధ్రులేయనువిషయమునుగురించి చర్చించుచు మాట్లాడిరి-వారిఉపన్యాసము శ్రీవైష్ణవ పత్రిక మార్చిసంచికలో ప్రకటింపబడినది- ప్రకృతానికి సంబంధించినభాగమును సంక్షేపించి వ్రాయుచున్నాము-శ్రీమద్రామానుజులవారు ఆంధ్రులనుటకు నిదర్శనములు.

౧-శ్రీమద్రామానుజులు ముప్పైయేండ్ల కాలము శ్రీరంగంలో ఉన్నను వారుఅరవవారైనట్లయిన శ్రీరంగనాథుని అరవములోస్తుతించి ఒక్క-పాశురమైనను రచించలేదు-వారిగద్యత్రయము సంస్కృతములోనే ఉన్నది.

౨-వారిశ్రీభాష్యమును ఎదుటనున్న శ్రీరంగనాథునికి కృతియిచ్చుటనుమాని చాలాదూరములోనున్న తెనుగురాయడని ప్రసిద్ధిగాంచిన శ్రీనివాసమూర్తికి (అనగా తిరుపతివెంకటేశ్వరునికి)అంకితమిచ్చుట వారిఆంధ్రాభిమాన సూచకము.

౩- కాశ్మీరదేశములోని శారదా పీఠములో శ్రీరామానుజులవారి బ్రహ్మసూత్రభాష్యానికి శ్రీభాష్యమను బిరుదమీయబడెను-అచ్చట మూలప్రతి యిప్పటికినిఉన్నది- అది భూర్జపత్రాలపై ఉన్నది-దానిలోనిలిపి తెనుగులిపి.

౪-శ్రీరామానుజులవతరించిన గ్రామం శ్రీపెరుంబుదూరు-అది చెంగల్పట్టుజిల్లాలోనిది- అచ్చటవిశేషముగా ఆంధ్రమే మాట్లాడువారున్నారు-ఈజిల్లాలోని శ్రీవైష్ణవులను "వడమల"వారనిపిలుతురు-అనగా ఉత్తరాదివారనిఅర్థము-వడమనుమాదిరిశే వైష్ణవము అని అరవవారనుచుందురు- చెంగల్పట్టు చిత్తూరుజిల్లాల ఉత్తరభాగము ఆంధ్రదేశము-శ్రీరామానుజులు వడమబ్రాహ్మణులని పిలువబడుచుండిరి.

౫-ద్రావిడులకు ప్రాయికముగాఇంటిపేరులుండవు-ఆంధ్రులకు ఇంటిపేరులాముఖ్యము- రామానుజులవారియింటిపేరు"ఆసూరివారు"దీనిచేవారు ఆంధ్రులనుట స్పష్టము-ఆసూరివారి ఇంటిపేరులుగలకుటుంబాలు కృష్ణా-గుంటూరు- నెల్లూరుజిల్లాలలో ఇప్పటికినీఉన్నవి. శ్రీరామానుజులవారికి చెందినవారు హారీతగోత్రులే- కందాళవారు ఆంధ్రులు- మాడుంబవారునుఆంధ్రులు- తిరుమల అనుఇంటి పేరుగలవారు ఆంధ్రులే.

శ్రీపెరుంబుదూరిలోని శ్రీరామానుజభాష్యకారులఆలయములోను తిరుమలశ్రీనివాసమూర్తి సన్నిధిలోను నిత్యోత్సవవైభవాదులు ద్రావిడాచారసంప్రదాయప్రకారంకాక ఆంధ్రదేశీయ సమయాచారమగు చాంద్రమానప్రకారమే అకాలమునుండి నేటివరకునుజరుగుచున్నవి-శ్రీనివాసమూర్తి సన్నిధిలో ఆంధ్రసముదాయమైనవారికి స్థానాచార్యాది మర్యాదలున్నూ రామానుజులసన్నిధిలో ఆంధ్రశ్రీకాలవారికిఅట్టిమర్యాదలున్నూ జరుగుచున్నవి.

ఈ కారణాలచేత శ్రీమద్రామానుజులవారు ఆంధ్రులేయని స్పష్టమగుచున్నది.

---

# విన్నారా?

హిందూస్థానములో మొత్తంపశువుల విలువ ౨౦౦౦కోట్ల రూపాయీలు.

... ... ...

ప్రపంచములో పశువులలో అయిదవవంతు పశువులు హిందూస్థానంలో ఉన్నవి-

... ... ...

పశువులనుకరిచే ఒకఈగకలదు-దానిని ఇంగ్లీషులో Warble fly అందురు-దానికాటువలన పశువులు,గొడ్లుచీటిలోట్లుచెడిపోయిఇండియాలో ఏటేటగొట్టిల అక్షలరూ నష్టం కలుగుతుంది.

... ... ...

ఇంగ్లాండుదేశములో పశువులకు టీకాలుతీసి రోగాలురాకుండా ముందుగా నిరోధించేదానికి అక్కడిరైతులు ఏటేట ప్రతిపశువుపై పదిన్నరషిల్లింగులు అనగా సుమారురూపాయీలు ఖర్చుచేయుదురు. హిందూస్థానములో ౧రూ॥ ప్రకారం ఖర్చుచేయవలెనంటే రైతులు చేతగాదంటారు-అందుచేత యిప్పుడు ౧పైసాఖర్చుతోనే చికిత్సచేసేమందులను కనిపెట్టినారు-

... ... ...

ఆవులుబర్రెలు ఆరోగ్యంగాలేకుంటే వాటి యజమానులుకూడా అనారోగ్యం పొందుతారు. క్షయమున్నగుజాడ్యాలు పశువులమూలానకూడా మనుష్యులకు వ్యాపించుచున్నవి.

... ... ...

భారతదేశములో కోడిగ్రుడ్లవలన ఎక్కువగా లాభంపొందుటలేదు- ఇంగ్లాండుదేశానికి ఏటేట చీనానుండి ౪౦లక్షలపౌనుల విలువగల గ్రుడ్లను తెప్పించుకొంటారు- ఇండియాలో గ్రుడ్లవిశేషమైతేచీనావ్యాపారంఇండియాకేదక్కుతుండేది.

హిందూస్థానములో ఏటేట౭౪కోట్ల౩౮లక్షల మణుములపాలు లభించుచున్నవి- దానిక్రయము ౧౭౫కోట్లరూపాయీలుఅయితే దీనిలో౧౪కోట్ల౩౦లక్షలమణుములపాలు దూడలకుసరిపోతుంది-మిగతదిమనుష్యులు వాడుకుంటున్నారు.

... ... ...

హిందూస్థానములో జనులు బర్రెపాలను నూటికి౫౦పాళ్లున్నూ ఆవుపాలు౪౭పాళ్లున్నూ గొర్లపాలు ౩పాళ్లున్నూ వాడుచున్నారు.

... ... ...

హిందూస్థానంలో ౨౩కోట్ల పశువులున్నవి- మేకలు ౫కోట్ల౭౦లక్షలున్నవి.

హిందూస్థానంలో ఏటేట ౧౫లక్షలఎకరాలలో పొగాకు పండించుచున్నారు-

... ... ...

హిందూస్థానములోని ఫ్యాక్టరీలలోసుమారు ౧౫లక్షలకూలీలు పనిచేయుచున్నారు.

... ... ...

ఇండియానుండి విశేషముగా చర్మాలు, ఎగుమతియగుచున్నవి.

ఇండియాలో ౨౦లక్షలచేతిమగ్గాలున్నవి.వాటిపైన౧౦కోట్లగజాల బట్టలు నేయబడుచున్నవి. హిందూస్థానమిల్లులలో ౪౦కోట్లగజాల బట్ట నేయబడును.

... ... ...

హిందూస్థానంలో బంగారు విశేషంగా మైసూరులో లభించుచున్నది-ఏటేట ౩లక్షలఔన్సుల బంగారు లభించుచున్నది-

... ... ...

# తూర్పు ఇండియా దీవులు

హిందూస్థానానికి తూర్పుసముద్రములో కొన్ని ద్వీపాలున్నవి. అవిఇండియాకు తూర్పునను న్నందున తూర్పుఇండియాదీవులని (ఇంగ్లీషులో ఈస్టిండీస్)అందురు. అవివిశేషంగాడచ్చి వారికిలోబడినవి. యూరోపుఖండంలో హాలెండుఅనుదేశమున్నది, అదిమనహైదరాబాదులోని రెండుజిల్లాలఅంతప్రదేశము-సుమారు౧౦వేలచదరపుమైళ్లవైశాల్యంగల దేశము దేశంపేరుహాలెండు అయినన్నూ అచ్చటిజనులపేరు"డచ్చివారు" అనియందురు. హాలెండుదేశాన్ని హిట్లరుయీయుద్ధంలోజయించి ఆక్రమించుకొన్నాడు. ఇకహాలెండువారికి భానిసదేశాలైన తూర్పుఇండియాదీవుల సంగతికనుగొందము. ఈదీవులుచిన్నవిపెద్దవినూర్లకొలదిఉన్నవి. అవిరెండుభాగాలుగా ఉన్నవి. అందొకభాగములో జవా, మదురా అనుదీవులున్నవి. ఈదీవులలో పెద్దపెద్దద్వీపాలేవనగా సుమత్రా, బోర్నియో, సెలిబెస్, మొలక్కా-అనునవి ఇవిరెండవభాగములోచేరినవి. ఇందుబోర్నియో సగంభాగంఇంగ్లీషువారి అధీనములోఉన్నది ఈదీవులలో చాలముఖ్యమైనవి- జవా,సుమత్రా అనుద్వీపాలు. సుమత్రాఅనునది మనహైదరాబాదురాష్ట్రము.కటి గొప్పద్వీపము- హిందుస్థానములోబ్రిటీషువారు రాష్ట్రాలుగావిభాగించి మైస్రాయినిగవర్నరులను పరిపాలకులుగా ఏర్పాటుచేసినట్లుగానె తూర్పుఇండియాదీవులను డచ్చివారు పరిపాలించుచున్నారు వాటికన్నింటికి ఒకగవర్నరుజనరలున్నాడు- మరలవేరువేరుద్వీపాలకు ఒక్కొక్కగవర్నరు అతనిఅధీనములోఉన్నాడు మైగామనదేశములో దేశీయప్రభువులున్నట్లుగా అచ్చటకూడా దేశీరాజులున్నారు.

దీవులలోని శీతోష్ణస్థితి సమముగానుతేరపుగానుఉన్నది. సముద్రతీరాలు సుఖకరముగానున్నవి. అచ్చటిజనులలో జవావారు, బలిద్వీపంవారు బటకులు, అనువారున్నారు. అందరునుమలయాసంతతికిచేరినవారు, కొందరుచీనావారున్నారు, కొందరుఅరబ్బులుకూడా ఉన్నారు. డచ్చివారున్నూ ఉన్నారు.

ఈద్వీపవాసులు పూర్వముహిందువులుగాను తర్వాతబౌద్ధులుగానుఉండిరి. తర్వాతఇస్లాంమతము వ్యాప్తిఆయ్యెను, ఇప్పుడుబహుళజనులు ముసల్మానులు-డచ్చివారిప్రవేశమైనతర్వాత మనఇండియాలో వలెమిషనరీలు క్రైస్తవమతవ్యాప్తిని చేయుచువచ్చినారు. బలిద్వీపములో మాత్రము హిందువులెక్కువగాఉన్నారు. డచ్చివారు ఈదీవులలోని స్త్రీలనువివాహమాడి అచ్చటనేనిలిచిపోయినారు- వారికిగానుబట్టలకొలాలున్నవి.సుమత్రాలో ఒరాంగోటాంగుఅను మనిషిఅంతపెద్దకోతులున్నవి. జవాలోఒంటికొమ్ముగలఖడ్గమృగాలున్నవి

ఈదీవులుచాల సారవంతమైనవి, గనులుచాలాఉన్నవి. జనులుమంచివ్యవసాయికులు. అచ్చట వరి, రబ్బరు, కాఫీ, పొగాకు, పట్టుమొదలివిశేషముగాపండును. ఎక్కడచూచినా కొబ్బరిచెట్లు. వీటివల్లప్రభుత్వానికి చాలాఆదాయంఉంది. లోహాలలోముఖ్యమైనదిటిన్ను ఇక్కడదొరుకును- పెట్రోలియం చాలాదొరుకుచున్నది. బలిద్వీపవాసులు మంచిలోహాముపనులుచేయువారు. జవాలో సురబాయా, బటేవియా అనునవిమంచి ఓడరేవులు, ఈదీవులలోరైల్లురోడ్లు, బస్సు చాలానిర్మింపబడినవి. గతసంవత్సరంహాలెండును జర్మనీగెలిచినను దానిరాణి ప్రభుత్వమున్నూ ఇంగ్లాండులోఉంటూఅక్కడినుండి ఈదీవులను పరిపాలించుచున్నారు.

ఇప్పుడుఈదీవులకు బాధలైన హాలెండువారు పరాధీనులగుటచేత ఈదిక్కులేనిదీవులను కబళించితేతామని జపానువారు కన్నువేసియున్నారు. జపాను ఇండోచీనాను ఆక్రమించుకొన్నది. దానిసమీపంలోనే ఈదీవులున్నవి- డచ్చివారిని బెదిరించి ఈదీవులలో,అధికారంసంపాదించే దానికి జపాను ప్రయత్నించుచున్నది- హాలెండుఇంగ్లీషువారికిమిత్రదేశము. అందుచేతహాలెండువారి యీ తూర్పుదీవులను సంరక్షించుట ఇంగ్లీషువారికవసరము లేకుంటేజపానువాటినిమ్రింగి ఇంగ్లీషువారి అధీనదేశాలకు ముప్పుతేవచ్చును. అందుచేత ఈదీవులరక్షణ మనరక్షణఅన్నమాట. అందుచేతవీటిరక్షణకు మనముసహాయంచేయవలెను-

(సికింద్రాబాదు యుద్ధవార్తా వార్తప్రకటనలనుండి అనుకరణము)

ఐర్ దేశఅధ్యక్షునికి ఏటేట ౨౫౦౦ పౌనుల జీతమిత్తురు. ఇప్పుడుడీవలరా గారు ఐ. దేశాధ్యక్షుడుగాఉన్నారు. వారుదేశభక్తితో ౨౫౦౦కు బదులుగా ౧౫౦౦పౌనులను మాత్రమే తీసుకొనుచున్నారు.





## కొబ్బరి కుడుకల కొట్లాటలు

(విలేఖరి)

ధనవాడ, ౩౧-౧౦-౧౩౫౦ఫ:

ధనవాడ గ్రామము మఖల్ తాలూకాలో నిది. ఇక్కడ ప్రాథమిక పాఠశాలలో హిందూబాలకు లయొద్ద ప్రతిఒక్కరియొద్ద కొబ్బరికుడుకు తీసుకొని అయిదుగురుఉపాధ్యాయులు, ఒక చప్రాసీకలసి ఒకుడుకులను పంచుకొనేఅప్పుడు ప్రతిపంతులుకు ౧౦ కుడుకులవచ్చెను. చప్రాసీకి రావచ్చినందుకు తేనుపిల్లలవద్దవసూలు చేసితిని, నాకుగూడ ౧౦ ఇవ్వుమనెను ఈకారణముచే పరస్పరము కొట్లాడుకొనిరి. కుడుకలు లేవని చెప్పుచున్న బాలురను భయపెట్టి కొబ్బెరలు వసూలు చేసిరి. బీదపిల్లలు తల్లితండ్రులదగ్గరకువెళ్ళి కొబ్బరికై హఠము చేసిరి. కాని తల్లితండ్రులకే తినుటకుఅన్నము లేదు, వారెక్కడనుంచి తెచ్చిఇవ్వగలరు? ప్రజలకుకష్టములున్నా పంతుళ్లకుకట్నాలు అర్పించవలసివచ్చెను సర్కారుచేతమిచ్చినను, పైలనూర్లు వేరేఇక్కడ హెడ్ మాస్టర్ గారు పాఠశాలలో పలువిషయములలో పాల్గొనుచుందురు. పంతులువారు వెనుకటికి పులిమామిడి అనే గ్రామములో పనిచేసిరి. ఇక్కడ హిందుముస్లింలు అన్నదమ్ములమాదిరి పరస్పర ప్రేమ చేయుచున్నారు. ఈవిషయం పంతులుగారికికనబడనట్లున్నది.

## అప్పులవారి బాధలు

(విలేఖరి)

మహబూబునగరు ౩౦-౧౦-౧౩౫౦:

ఈజిల్లాలో చాలాప్రాంతాలలో వర్షాలులేక మేతలులేక రైతులుచాలానష్టపడినారు. ఈక్షామముఇట్లుండగా నాగర్ కర్నూలు స్థానికములో కలరావ్యాపించి రోజుకు ౧౦మంది జనులు చనిపోవుచున్నారని తెలియుచున్నది. దీనికికారణము ముఖ్యముగా పెద్దగాలియనే యగుపడుచున్నది. కాఅస్థితినిగమనించి పెట్టుబడిదారులు అనగా సాహుకార్లు అసామీలకుఋణములివ్వడముగూడ మానివేసినారు. దీనిపరిణామముఏమంటే బీదరైతులువిధిలేక పేదలేపు కొందరుదుంపగీలు ఆరబ్బులు మున్నగువాండ్లు ఒకటిరెండు మిత్తిగాతీసుకొనువారలుపాల్పడి తర్వాతఆధికకష్టములకు కుదవలాతీచెల్లల ననుభవింపవలసివస్తుంది. కావున దయామయులగు ప్రభుత్వఅధికారులు పైవిషయములనుగమనించి ఆయాప్రాంతములలో సంచరించి రైతులకు తగుఆర్థికాది సహాయములనుచేసినచో రైతులకష్టములు కొంతవరకుతీరగలవు.

## ఉమామహేశ్వర క్షేత్రము

శ్రీశైలోత్తరద్వార ఉమామహేశ్వరఆలయాదిదుర్దశ తొలగించుబాధ్యత జటప్రోలుసంస్థానప్రభువరేణ్యుల దయాంతఃకరుణలపై ఆధారపడియున్నది.

ఈప్రభువులమూలపురుషులు అరవతరము వారు దావాయనంగారు శాలివాహనశకం ౧౫౫౫ సంవత్సరములో దేవరకొండజిల్లాలోయుండి రాజ్యపరిపాలనచేసినవారు.

ఘనకీర్తివహించిన అమహామహునిచే ఉమామహేశ్వరమంటపములు రమ్యముగానిర్మించి నేటికి అరునూర్లసంవత్సరములైనది, ఈఆలయము సరియయినపాలనలేకపోవుటచే అగ్రహారాది యీనాములన్నియు ఖాల్సాలోకలిసిపోయినవి అర్చకులు దేశత్యాగులైరి ఆలయములు శిథిలింపజొచ్చెను. ఇట్లుండ నేటికి౫సంవత్సరములనుంచి బ్రాహ్మణుడును వానప్రస్థాశ్రమాచారపరుడును భగవద్భక్తుడునగు విశ్వనాథయోగిఅనుమహనీయుడు యీప్రదేశమందునిలచి శైథిల్యసంస్కారనిమిత్తం సర్కారువారివలన మంజూరిహుకుములు పొంది చుట్టుగ్రామాల భిక్షాటనచేసి, మరమ్మతులుజనులసౌకర్యమునకు తగుఏర్పాట్లు చేయుచు నైవేద్యాదులనిమిత్తం అర్చకుని పూజ్యపనివాండ్లనుఏర్పాటుచేసి మంచిఅభివృద్ధికి తెచ్చుచున్నవారలు. కానిరోజులుఅనేకలకొలది ద్రవ్యవ్యయముచే కట్టించినమందిరములు మరమ్మతు కావలయునన ఇట్టిభిక్షాటనచేయుటెంతకాలమునకు ఈఆలయముల దుస్థితిపొలగునో పాఠకులూహింపవలయు. మహాఘనతవహించిన ప్రభుమూర్తులదయాంతఃకరుణలు ఈక్షేత్రములందు ప్రసరింపజేసిన క్షేత్రదుర్దశతొలగి మహోదశనొందుననియు ప్రభువులదివ్యదృష్టిని మహోత్సవములో ప్రసరింపచేయుదురనియు, ప్రార్థన,

ఇట్లు విన్నవించు
నరశింగరావు పట్వారి

### జోగిపేట పద్మశాలి యువజన సంఘోత్సవము

శ్రావణ శు॥ ౧౫ నాడు పద్మశాలియువజన సంఘభవనమునుండి సుమారు నూరుమంది మహావైభవముగా పెద్దబజారునుంచి నీతిభజనలుచేయుచు జోగినాథస్వామిగుట్టపైకేగి దర్శించివచ్చిరి. యిట్టిస్వచ్ఛమైన మహావైభవసాగరమునకు మంచినవారు శ్రీమాన్ కంది నాగయ్యగారుధన్యులు

### శుభ సమాచారము

నల్లగొండజిల్లా సూర్యాపేటతాలూకా వేల్పోలుమక్తాదారుగారగు తడకమళ్ళ సీతారామచంద్రరావు గారు తమకుమారుని ఉపనయనము ౧౬-౫-౧౩౫౦, కుమార్తెవివాహము ౨౦-౫-౧౩౫౦జరిపి బంధుమిత్రాదులతోపమావేశానందముపొందిరి.

## ఖమ్మంమెట్టు

### కరోడ్గిరివారి చర్య

ఖమ్మంమెట్టు రైల్వేస్టేషను కెంబడే గేటుప్రక్క గా కస్టమ్సువారి ఆఫీసుగలదు. వాడుకగా చాలాకాలమునుండి వచ్చుపోవుప్రయాణీకుల సామానులను యీఆఫీసుముందువిప్పి తీయించిచూచుటఅలవాటుగాఉండేది. ఇటీవల దాదాపు నెల దినములనుండి వీరుఒకక్రొత్తపద్ధతిని అమలుజరుపుచున్నారు. ఆఫీసుయొక్క గేటుగుండా దొడ్డిలోనికి సుమారు ౩౦ లేక ౪౦ గజములదూరముప్రతివారును పోవలెనట. అచ్చట అఆధికారులు కుర్చీలువేసుకొని 'కూర్చొనియుంటారు. వీరందరును వారిసమక్షమువరకు వెళ్ళి తమమూటలు తెలను అచ్చటవిప్పి చూపించిరావలయును- యీపద్ధతివల్ల అనవసరపు ప్రయాసలుకలుగుచున్నవి- యీవిషయముపై పౌరులుచాలాఅసమ్మతిని తెలుపుచున్నారు. కానిఅధికారులనుగ్రహించి యీవిషయమునసాధ్యమైనంతత్వరలో పూర్వమువలె గేటుప్రక్కనే పరిశీలించి పంపుఏర్పాట్లు చేయగలందులకు ప్రార్థించుచున్నాము.

### ఆర్యసమాజము కామాటిపురము (బొంబాయి)

సమాజముపైపునుండి తా॥౨౩-౭-౪౧సాయంకాలము ౬గం॥ తెలుగుమున్సూరువాడిలో శ్రీ నరహరిప్రభు నీలవరుగారి ప్రియపుత్రుకు "నామకరణసంస్కారము" పండితలక్ష్మణరావు వోగేటిగారిద్వారాజరిగెను తదనంతరంపండితప్రతాపచంద్ర బి.ఏ గారు "సంస్కారము"యొక్క మహిమనుగురించి గంభీరోపన్యాసముచేసిరి పిదప ౫౦౧౭౦దలజనసంఖ్య ప్రీతిభోజనములో పాల్గొని "సంస్కారము"ను సఫలపర్చిరి.

ఇట్లు
ఎస్-బి- కృష్ణ (బొంబాయి)

## పెట్రోలు నిబంధన

హైద్రాబాదు-దక్కన్ మెహరె,

ప్రభుత్వ ప్రకటనశాఖవారిట్లు తెలుపుచున్నారు,-

బ్రిటిషిండియాలో పెట్రోలుసప్లయి తక్కువగాఇచ్చుటకు ప్రభుత్వమువారు ఆజ్ఞాపించినారు- ఆదేవిధముగా హైద్రాబాదురాష్ట్రములోను ౧ సెప్టెంబరునుండి పెట్రోలుతక్కువగా సప్లయి చేయబడును ఆవివరణఇంతలో తెలుపబడును. ఈవిధంగా మోటారుయజమానులకు ఇబ్బందికలుగుటకు ప్రభుత్వమువారు విచారపడుచున్నారు- అయినాఅందరును ఈనిబంధనప్రకారం వర్తించుకొందురని కోరుచున్నారు ఈరాష్ట్రానికివచ్చే పెట్రోలుపరిమాణములో ఇంతవరకేతగ్గింపుచేసి పంపబడుచున్నది- కావున మోటార్లవారు అనవసరంగా పెట్రోలువ్యాపారమును తొందరపెట్టరాదు-

### భూరిదానము

రాజా ధరంకరణ్ గారు సికింద్రాబాదుయంగ్ మెన్సుక్రిశ్చియన్ అసోసియేషన్ అనుపేరుగలసంస్థకు ౩వేలరూపాయీల "అత్యంతమైనవిలువగలదానము" అనుగ్రహించినారుఅని రయ్యత్ పత్రికలో వ్రాయబడినది

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర శ్రావణ బ॥ ౮

సోమవారము

## కవిరాజు అస్తమయము.

జగద్విఖ్యాత కవిశేఖరులగు రవీంద్రనాథ టాగూరుగారి దేహాంతమయ్యెనను పిడుగువంటివార్త సేతుశీతాచాల పర్యంతము దేశమునంతయువిషాదసాగరములో ముంచివేసెను. ప్రపంచములో కవులెందరో ఏటేటచనిపోవుచుండగా వీరుచనిపోవుట—అందులోను ౮౦ ఏండ్లవార్ధక్యదశలో చనిపోవుటలో—ఏమివిశిష్టత? అతడుభారతీయుడైనందున విచారమా? భారతదేశములోను కవులెందరో చనిపోవుచునేయున్నారు. వారికొరకై కొన్నిసమయములలో మనము మన మహాసభలలో విషాదతీర్మానాలను గూడా చేయనిరాకరించుచుండుట కలదు కదా! మరెందులకీ విచారము? ఈ ప్రశ్నకు సమాధానమిచ్చుటసులభమే. రవీంద్రుడు కేవలము భారతీయ మహాకవి కాడు. అతడు జగత్కవి. అతనిగ్రంథాలలో ముఖ్యమైనవాటిని నాగరికతనొందిన భాషలన్నింటిలోనికిని అనువదించుకొన్నారు.

యూరోపుఖండ వాసులు ఏషియాఖండములోని మహాపురుషుల గొప్పతనాన్ని అంగీకరించికే తమసంస్కృతి కేలోటువచ్చు ననుకొందురో యేమో కాని యింతవరకు మనభారత దేశమందలి ప్రాచీనాధునిక మహాపురుషులను గురించి సాధారణముగా మెచ్చుకోలుతో వ్రాసినట్లుకానరాదు. ప్రపంచ మహాపురుషులను గురించి వారెన్నియో గ్రంథాలుముద్రించినారు. శిల్పశాస్త్రిలను గురించివ్రాసినారు. లలిత కళలనుగురించి వ్రాసినారు. జ్యోతిషాది శాస్త్రాలగురించి వ్రాసినారు. కాని అందెందును భారతీయుల పేరులు కానరావు. యూక్లిడు కన్న చాలాపూర్వము వెలువడిన శుల్బసూత్రాల పేరెత్తుకొనరు. కెప్లర్ కన్న ౧౨౦౦ ఏండ్లకు ముందుండిన ఆర్యభటునిస్మరించరు. గోథిక్ శిల్పమును తలదన్నేగుహాశిల్పముల పేరెత్తరు. మన పురాణాలు హోమరు నుండి దొంగిలినట్టివట! వైష్ణవభక్తిమార్గము క్రైస్తవులవద్ద తస్కరముచేసినదట! భారతదేశమందలి యావత్తువాఙ్మయము ఈసాపు కథలకు లోకువేనట. ఇవి పాశ్చాత్య పండితుల వ్రాతలు.

అట్టి పాశ్చాత్యులుకూడా రవీంద్రుని కవితను, వ్రాతలను, భావాలను, వేనోళ్ళ మెచ్చుకొన్నారు. అంతేకాదు వారి "గీతాంజలి" అనుచిన్నపుస్తకాన్ని చదివి ముగ్ధులైనోబెలు బహుమానము (౮౦౦౦ పౌనులు) వారికిప్రసాదించిరి. అయితే రవీంద్రుని కవితలో ఏమివిశిష్టత? అనియడిగిన సర్ రాధాకృష్ణయ్యగారన్నట్లు వాల్మీకి తర్వాత కాళిదాసు, కాళిదాసుతర్వాత రవీంద్రుడు భారతీయకవులలో అగ్రగణ్యతనొందినవాడు అని చెప్పవలసియుండును. రవీంద్రుని భావాలు ప్రకృతిలో లీనమైనట్టి సుందరభావములు. అత్యంతానంద దాయకములు. ప్రబోధకరములు. నీతిదాయకములు. అట్టి కవిశేఖరుడు దాస్యదేశములో జన్మించి భారతీయులకు కీర్తి తెచ్చెను.

జర్మనీకి ౨౦ యేండ్ల క్రిందట రవీంద్రుడు పోయినప్పుడు మాయేసుక్రీస్తు ప్రత్యక్షమైనాడని ఆ జనులు భావించిరి. ఫ్రాన్సులో వారిని పూజించిరి. రష్యావారు బ్రహ్మరథముపట్టిరి. ఇంగ్లాండులోకూడా వారికి అగ్రపూజ జరిగెను. సర్ గవర్ గారికిపట్టినగతి వారికిపట్టలేదు. అమెరికా ఖండానికివెళ్ళినప్పుడు కనడావారు వారినాహ్వానించిరి. "ఛీ! మీదేశములోనేను అడుగుపెట్టనుపో!" అని వారుకఠినముగా చెప్పిరి. సుకుమారకవికేమి! ఇంతటికఠిన భావనయేమి? అని తెలియని వారనుకొందురు. కనడాదేశము తమ దేశములో కాలా హిందూస్థానీలు కాలుపెట్టగూడదని శాసించినట్టి దేశము. కావున నాసోదరులను రానీయని దేశములోనికి నన్నురమ్మని పిలుచుట మీకుసిగ్గెందులకు లేదని ఆత్మగౌరవమూర్తియైన రవీంద్రుడుపలికెను. వారి దేశభక్తి అంతటిగాఢమైనట్టిది.

రవీంద్రుడు లలితకళలలో అపారమగు ప్రీతికలవాడు. ఇంచు మించు ౩౦౦౦ బంగాలీపాటలను రచించెను. ఆ పాటలను చదువురాని బంగాళీలుకూడా పల్లెపల్లెలోపాడుదురు. కవితఅంటే అదియేకవిత. రవీంద్రుడు ముసలిముప్పున ౭౦ఏండుదాటిన తర్వాత చిత్రలేఖనము స్వయముగా నేర్చుకొన్నాడు. ఆయన తనకుతోచినట్లుగా చిత్రించిన పటాలను ఫ్రాన్సు దేశమువారు వేనవేలధనమునిచ్చి కొన్నారు. ఆపటాలు మనకర్థముకావు. అర్థముచేసుకొన్నవారు పైవిధంగా ద్రవ్యమిచ్చినారు. రవీంద్రుని గ్రంథాలను ఇంగ్లీషుకంపెనీలవారు ముద్రించినారు. వారిగ్రంథాలలోని ప్రతిమాటకును రెండుపిల్లింగులవంతున కిక్కురుమనకుండా సమర్పించుకొన్నారు. వారిమాటలంటే పాశ్చాత్యులకే యెంతటివిలువనో గ్రహించండి. అస్తుతే టాగూరు లక్షలు లక్షలు సంపాదించెనన్నమాట! నిజమే! అట్లేసంపాదించెను. లక్షలు సంపాదించినవారు మన హైదరాబాదు రాష్ట్రములోకూడా చాలామందికలరు. సంపాదించినరీతిగానె ఉదారముగా వ్యయము చేయనేర్చినవారె చిరంజీవులై యుందురు. టాగూరుగారుతన ద్రవ్యాన్నంతయు శాంతినికేతనము అనుపేరుతో తాను స్థాపించిన ప్రజాసంస్థకు వినియోగించెను. ఈ ఔదార్యము వారికి అనువంశికముగాసంక్రమించినట్టిదని వారిజీవితచరిత్రను చదివినచో తెలియగలదు.

౧౯౧౫ లో మహాత్మాగాంధిగారు సత్యాగ్రహోద్యమమును ప్రారంభించిరి. టాగూరుగారు దానికికొంతవరకుప్రతికూలురయియుండిరి. ఆకాలంలో సీ. యఫ్. ఆండ్రూసుగారు గాంధీ టాగూరుల కుభయులకును శిష్యులే. ఉభయుల భావాల సమన్వయించేదానికి చాలాప్రయత్నించెను. లాభము లేకపోయెను. టాగూరుగారి "సన్యాసి" అను నాటకములో గాంధీగారి తత్వాలను అన్యాపదేశముగా వెక్కిరించుటకానన గును. అయితే టాగూరుగారిఅన్నగారు శతవృద్ధులైనను గాంధీగారితో అక్షరమక్షరము ఏకీభవించినవారైయుండిరి. ఇట్లుండగా టాగూరుగారు అయిదారేండ్ల నుండి గాంధీగారిని అత్యంతముగా ప్రేమించి వారినిగౌరవించి వారితో ఏకీభవించుచు వచ్చినారు.

ఇట్టి అనంతోత్కృష్ట గుణములతోనిండిన పూజ్యులైన రవీంద్రునిగురించి యెంత వ్రాసినను తక్కువే. వారిచరిత్రలో మేమెంత వ్రాసినను ఏమియు వ్రాయజాలము! అట్టిమహానుభావుని భారత దేశము కోల్పోయినది. వారిస్థానమును స్వీకరించు మహావ్యక్తి ఇప్పట్లో కానవచ్చుటలేదు. వారి పవిత్రాత్మకు ఉత్తమలోక ప్రాప్తికై పరమేశ్వరుని భారతీయులందరును ప్రార్థింతురుగాక!

## వర్ణాంతర వివాహాలు

యుగపతి

వర్ణాంతరవివాహాలు పూర్వంచాలాలేకుండెను ఇప్పుడుగూడా అవసరంలేదని శ్రీనందిగాను దత్తాత్రేయరావుగారు గోలకొండపత్రికలో వ్రాసినారు. చాలాలేకుండెనుఅనుటచేత కొద్దిగా పూర్వంలోనూఉండెననిన్ని ఇప్పుడున్న "చాలా"వరకుపోక కొద్దిగా చేయవచ్చుననిన్నీ వారివాదాన్ని అర్థముచేసుకొనవలెనో యేమో? అయినా వారుచూపించినకారణాలు తృప్తికరముగాలేవు.

"వజ్రసూచికోపనిషత్తు"

అనుచిన్న ఉపనిషత్తు వావిళ్ళవారు తెనుగర్థముతోముద్రించినారు– దానివెల ౨ అణాలు మాత్రమే దానినింతవరకుచదువనివారు తప్పకుండా చదువవలెననికోరుతున్నాను. ఆందీచర్చకు పనికివచ్చే భాగాన్ని ఉదహరించ మన్నాను. బ్రాహ్మణత్వానికేదిప్రధానం?

"కో వా బ్రాహ్మణో నామ
కింజీవః? కిందేహః? కింజాతిః?
కింజ్ఞానం? కింకర్మ? కింధార్మికః?

అనిప్రశ్నవేసికొని ఇవన్నియుప్రధానంకావు అనిచెప్పుచు ఇట్లుతెలిపినారు,

"తర్హి జాతిర్బ్రాహ్మణ ఇతిచేత్, తన్న; తత్రజాత్యంతరేష్వనేకజాతి సంభవాత్ మహర్షయో బహవస్సంతి, ఋష్యశృంగో మృగ్యాః, కౌశికః కుశాత్, జాంబూకో జంబుకాత్, వాల్మీకో వల్మీకాత్, వ్యాసః కైవర్తకన్యాయాం, శశపృష్ఠాత్ గౌతమః; వసిష్ఠ ఊర్వశ్యాం, అగస్త్యః కలశేజాత ఇతిశ్రుతత్వాత్, ఏతేషాం జాత్యావినాప్యగ్రే జ్ఞాన ప్రతిపాదితా ఋషయోబహవస్సంతి తస్మాన్న జాతిర్బ్రాహ్మణఇతి.

వర్ణము బ్రాహ్మణుడనినదొడల ఆదికాదు. ఒకవర్ణములోనే అనేకవర్ణాలుకలిగెను. ఋష్యశృంగుడు లేడికి, కౌశికుడుదర్భకు, జాంబూకుడునక్కకు, వాల్మీకుడుపుట్టకు,వ్యాసుడు బెస్తకన్యకకు, గౌతముడు కుందేటికి, వశిష్ఠుడు ఊర్వశియను భోగముదానికి, అగస్త్యుడుకుండకు, పుట్టిరి.

పైప్రమాణాన్నిబట్టి మహర్షులు జంతువులకు కుండలకు, గడ్డికి,పుట్టలకు, కన్యకలకు, వేశ్యలకు బెస్తలకుపుట్టినట్లు స్పష్టమగుచున్నది. ఈవజ్రసూచికోపనిషత్తును మొదటముద్రించిన పల్లెంచల రావుగారు ఈయుపనిషదంతమందు తమపత్తాన యీవిధముగావ్రాసినారు.

"పైచెప్పబడినవచనముల కనుగుణము గాబ్రాహ్మణేతరులుసైతము బ్రాహ్మణులైనట్లు భాగవతములో నీక్రిందిప్రమాణములుకలవు.

౧౦–౧౨ శ్లోకాలు ౫ వప్కంధమునకధ్యాయం
౧౩,౨౧,౨౨,, ౯ ,, ౨ ,,
౧౧ ,, ౯ ,, ౧౩ ,,
౧ ,, ౯ ,, ౨౦ ,,
౨౭,౩౨,౩౩ ,, ౯ ,, ౨౧ ,,

ఈప్రమాణాలనుబట్టి శూద్రులు బ్రాహ్మణులైనట్లు తెలియవచ్చును.

అట్లయితే శూద్రులెప్పుడు బ్రాహ్మణులైనారో, అట్లుబ్రాహ్మణులైనవారు బ్రాహ్మణస్త్రీలను వివాహమాడి బ్రాహ్మణవంశములకు కర్తలెప్పుడైనారో ఆయాచారాన్నే వర్ణాంతరవివాహమంటూరా లేదా? పాండుధృతరాష్ట్రులు నియోగముచేపుట్టినారని యానియోగమువివాహముకాదనియు రావుగారుతెలిపినారు. వివాహముకాదు నిజమేకావున అదివ్యభిచారమేయగును. వ్యభిచారమువలనపుట్టినవారికి గౌరవమర్యాదలుకలుగునా? అట్టివారిసంతానము దేవతాన్గ్రహజనితమని రావుగారంటున్నారు, కుంతి ముగ్గురు పరపురుషులనుపొంది సంతానముపొందినది,పెండ్లి కాకముందే ఒకన్నికన్నది.మాద్రియిద్దరి పరపురుషులనుపొంది సంతానముకన్నది. దీనికి సమాధానమేమంటే వ్యభిచారముచేసినవారు దేవతలట! ఈకాలములోకూడా వ్యభిచారంచేసేవారంతా దేవతలని మనము సమాధానపడవచ్చునా? హిడింబి రాక్షసియేకాని వాస్తవముగాక్షత్రియజాతి స్త్రీయే! అనిరావుగారనుచున్నారు. రావణుడు రాక్షసుడేకాని నిజంగాఅతనుబ్రాహ్మణుడే అందుచేత లంకలోనిరాక్షసులంతా బ్రాహ్మలే. రాముడు బ్రాహ్మలజంపెను అనితర్కించితేయెట్లుంటుంది– వేదకాలములో నూటికి ౯౯ పాళ్లు సవర్ణవివాహములేనట–మిగతా ఒకపాలుఏమైంది. చారిత్రిక నిదర్శనములలోనికి రావుగారుపోనియ్యరు–ఎందుకంటే చరిత్రలు విదేశీయులచేవ్రాయబడినవట "కావున నమ్మదగినవికావు"ట. "ఒకవేళనమ్మినను, పౌరాణిక వర్గమువారికి సనాతనులకంతగా ప్రమాణములుకావు"అని రావుగారు కొట్టిపారవేసినారు. పురాణాలు నమ్మదగినవికావు–అవి ప్రమాణాలుకావు అని ప్రాచీన భారతీయ తార్కికులన్నారు. ఆచార్యత్రయమువారు తమతమ భాష్యాలలో పురాణాలకు కనిష్ఠస్థానమిచ్చినారు– పురాణాలుపరస్పరవిరుద్ధమైనవి ఒకే పురాణములో వివిధస్థలములలో ఒకేవిషయమునుగురించి పరస్పర విరుద్ధాంశములను వర్ణించినారు, పురాణాలు ఎల్లప్పటికినీపెరుగుతూవచ్చినవి– ౭౦౦౦శ్లోకాలభారతము ౧ లక్ష శ్లోకాలగ్రంథముగా పెరిగెను– రావుగారు ఉదహరించిన స్కాందపురాణము ఇప్పటికిని పెరుగుచూఉండేగ్రంథము. అట్టిపురాణాలను వారునమ్ముతారట. చరిత్రను వారునమ్మరట– విదేశీయులువ్రాసినచరిత్రలు అబద్ధమైతే స్వదేశీయులువ్రాసిన చరిత్రలనైనా రావుగారొప్పుకొందురా! స్వదేశీయులు విదేశీయులను అనుకరించినారుకావున వారినిసూడా ఒప్పుకోముఅంటారా? రావుగారు శాసనాలనైనా ఒప్పుకుంటారా? అవికూడా అబద్ధంఅంటారా! సర్వంకల్లా సాగరంకల్లాఅంటే శ్రీదత్తాత్రేయ రావుగారికే దిగ్విజయపత్రమిచ్చి ఆడియోదానుఅని పిలవవలసివచ్చుకుంటాము–

ముందువ్యాసములో చారిత్రికప్రమాణాలను విరివిగా చూపించబోతున్నాను.

## కత్తితో పొడుచుట

గతగురువారము నాడు రాత్రి ౯గంటలకాలములో హైదరాబాదునగరములో గోలకొండపత్రికాలయముఎదుట ఇద్దరుపఠానులుమాదిరపఠానుని కత్తితోమూడుమారులుపొడిచి నెమ్మదిగా ఆలిబుసాపురకుపోళ్ళి అచ్చటటాంగాతీసుకొని యుధేచ్ఛగాజనిరని తెలియవచ్చుచున్నది. కొంతసేపటికి అది ను గారువిజయంచేసి పంచునామచేసుకొని మూర్ఛనందున్నవానిని మోటారులో ఆస్పత్రికితీసుకొనిపోయిరట.

### హీరాలాల్ కోటేచా

హీరాలాల్ కోటేచా అనువారు లాజకీయఖైదీగా రాయవెల్లూరుజెయిలులో నుంచబడియుండిరి వారికిచాలాజబ్బుచేసినను వారికిచికిత్స చేయుటకు వారిని హైదరాబాదు ఉస్మానియాఆస్పత్రికి యానివేసుకొనివచ్చినారు.

## హైదరాబాదు బజారు ధరలు

తేది ౪–౧౧–౫౦ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లచొప్పున ధరలన్నీ చూపితి.

| బియ్యము | పల్లా ౧కి ధర రూ. అ. పై. |
|---|---|
| కిచిడీసాంబర్లు | ౨౫ నుండి ౨౮ |
| సంబర్లు | ౨౫, ౨౫ ౯ ౦ |
| ఢిల్లీబోగాలు | ౨౩ ౦ ౦ |
| రాంసాగర్ల శేవు | ౨౦ ౦ ౦ |
| సానక్రాం | ౨౦ ౦ ౦ కొత్తవి |
| ,, | ౨౩ ౦ ౦ పాతవి |
| ఆర్కాటి | ౨౧ ౦ ౦ కొత్తవి |
| ,, | ౨౨ ౦ ౦ పాతవి |
| కోసామణి | ౧౯ నుండి ౨౦ వరకు |
| బుకుములు | ౧౩, ౧౬ ౦ ౦ |
| దేశావరి | ౧౯, ౧౩ ౦ ౦ |
| **గోధుమలు** | |
| షర్బతి | ౨౨ ౨౧ ౦ ౦ |
| బన్సీ | ౨౦ ౪ ౦ ౧౯ ౯ ౦ |
| లష్కరీ | ౨౦ ౦ ౦ |
| పోటీయా | ౧౯ ౦ ౦ |
| ఎర్రగోధుమలు | ౧౯ ౧౦ ౦ |
| **జొన్నలు** | |
| తెల్ల జొన్నలు | ౧౨ నుండి ౧౧౪ వరకు |
| పచ్చజొన్నలు | ౧౧౹ ౧౧ ౦ ౦ |
| ముడికట్టు జొన్నలు | ౧౧౪ ౧౧ ౦ ౬ |
| సెనగలు | ౧౯ ౪ ౦ |
| కందులు యెర్రవి | ౧౧ ౨ ౦ |
| మినుములు | ౧౬ ౦ ౦ |
| అంకలు | ౧౪ ౪ ౦ |
| సజ్జలు | ౧౦ ౧౨ ౦ |
| **పప్పులు** | |
| సెనగ పప్పు | ౨౩ ౦ ౦ |
| కంది ,, | ౧౩, ౧౯ ౦ ౦ |
| సిరిసెనగ,, | ౨౧, ౨౧ ౯ ౦ |
| అంక ,, | ౧౩ ౯ ౦ |
| మినుప ,, | ౧౯ ౯ ౦ |
| పెసర ,, | ౧౯ ౯ ౦ |
| బెల్లము | ౧౩౪ నుండి ౧౬ వరకు |
| ఉప్పు | ౧౨, ౧౧ ౯ ౦ |
| పుల్లిగడ్డ | ౧౬ నుండి ౧౫౪ వరకు |
| వరుగు మంచిది | ౩౯ నుండి ౩౦ వరకు |
| చక్కెర మణుగు [౪౦ సేర్లు] | |
| జావా ,, ,, | ౧౪ ౦ ౦ |
| బొంబాయి ,, | ౧౩ ౧౪ ౦ |
| మద్రాసు ,, ,, | ౧౩ ౧౫ ౦ |
| నిజామాబాదు ,, ,, | ౧౩ ౧౨ ౦ |
| ఎర్రచక్కెర ,, పల్ల | ౧౩, నుండి ౧౫ వరకు |
| దర్గచక్కెర ,, ౪౦ సే. | ౧౬ ౧౨ ౦ |
| ఎల్లిగడ్డ మణుము ౧౨ సే. | ౪ ౧౨ ౦ |
| అల్లం ,, ,, | ౪ ౧౨ ౦ |
| మణుము ౧౨ సే | |
| కొబ్బెరనూనె ,, | ౪ ౯ ౦ |
| కుసుమనూనె ,, | ౫ ౦ ౦ |
| నువ్వులనూనె ,, | ౪ ౯ ౦ |
| వేరుసెనగనూనె ,, | ౩ ౦ ౦ |
| కిరోసీను (గ్యాస్) ,,డబ్బా ౧కి | ౪–౧౨–౦ |
| **నెయ్యి మణుము ౪౦ సేర్లు** | |
| బిదరు నెయ్యి ,, | ౪౯ ౦ ౦ |
| తెలంగానా ,, | ౪౫ ౦ ౦ |
| వనస్పతి డబ్బా ౧కి | ౧౧ ౨ ౦ |
| బంగారు తు॥ ౧కి | ౫౦ ౪ ౦ |
| వెండి ౧౦౦ తు | ౭౧ ౦ ౦ |
| ,, తు ౧కి | ౦ ౧౧ ౬ |
| సవరణ ౧కిగల్దారు రూ– | ౨౯ ౯ ౦ |
| **మారకం** | |
| హాలీకి కల్దార్లు | ౧౬ ౬ ౦ |
| కల్దారుకు హాలీలు | ౧౬ ౪ ౬ |
| ఆముదాలు బస్తా | ౧౧ ౪ ౦ |
| వేరుసెనగ ,, | ౯ ౪ ౦ |
| బుడ్లలు పల్లా ౧కి | ౯ ౪ ౦ |
| పప్పు ,, | ౧౨ ౦ ౦ |

గమనిక:— ధరలు ఏతేదివరకు సరియైనవిగా తెలుపుచుందుము. అయినను ఏమైన పొరపాటులుండిన దానికి పత్రికవారు బాధ్యులుకారు.

# రవీంద్రనాథ కవి సార్వభౌముని నిర్యాణము

రవీంద్రనాథటాగూరుగారు కవి సార్వభౌముడు కలకత్తాలో అపరేషను పై పోయియుండిరిగదా! అక్కడ వారికి నెమ్మదిగానున్నట్లుండెను. కానియింతలో కొద్దిరోజులనుండి వారిజబ్బుస్థితి అధికమైనది- జూలై౩౦వ తేదిన వారికి ఈప్రపంచపు స్పృహ లేకుండాపోయెను. ఆగస్టు ౭వ తేది ఉదయం౯గంటలకు డాక్టర్లు ఇక ఆశలేదని తెలిపిన తర్వాత బ్రహ్మసమాజనాయకుడగు రామానంద ఛటర్జీగారిని పిలిపించిరి. వారు ప్రార్థనసలిపిరి- ౧౧గం-౧౦ని.వేళ ప్రాణవాయువును టాగూరుగారి ఊపిరితిత్తులలోనికి పంపి డాక్టర్లు ఊపిరిపీల్చుటకు సౌకర్యము కలిగింపజూచిరి- టాగూరుగారు దానికి తట్టుకోనలేక పోవుచున్నారని అనిపించినపుడు ప్రాణవాయువునిచ్చుటను ఆపివేసిరి. టాగూరుగారు తర్వాత౧౨-గం.౧౩ని.లవేళ మరణించిరి- వాకిటవేచియున్న జనులకు ఈవార్త తెలుపబడగా, వారలు గదిలోనికివచ్చి టాగూరుగారికి నమస్కరించి వెళ్లిపోయిరి. టాగూరు గారి మరణవార్తను పండిత జవహర్లాలునెహ్రు, గాంధిమహాత్మునికిని తెలియజేసినారు.

౧౯౩౭లో జబ్బుగాకముందు టాగూరుగారు తాను మరణించిన తర్వాత తన అంత్యక్రియలను శాంతినికేతనములో జరిపించవలెనని తనవారలతో చెప్పియుండిరట- కాని తర్వాత మరల ఈసారి జబ్బులో వారా అభిప్రాయము మార్చుకొని ప్రజలకిష్టమైన చోట తన అంత్యక్రియలను జరుపవలసినదనిరట-

బెంగాలు గవర్నరుగారు శ్రీ॥ శే॥ టాగూరుగారి కుమారునికి ఆ కవిసార్వభౌముని గుణగణములను మెచ్చుకొనుచు తమవిషాదమును వెలిబుచ్చు సందేశమును పంపినారు.

(సంక్షిప్త జీవితచరిత్ర)

డాక్టర టాగూరుగారు ౧౮౬౧లో మహర్షి దేవేంద్రనాథటాగూరుగారికలన జన్మించిరి- వారికి ౧౮౮౩లో వివాహమయ్యెను-తర్వాతవారికి ఒకకుమారుడు, కుమార్తెకలిగిరి- వారు ఇంగ్లీషుచదువు చదివిరి- మొదటవారు కలకత్తాలో ఉండుండి తర్వాత ౨౪వఏట తనతండ్రియాస్తులను నిర్వహించుకొనుటకై గ్రామమునకుపోయిరి. అక్కడ వారు అనేకగ్రంథములను వ్రాసిరి-

౧౯౦౧లో వారుశాంతినికేతనములో ఒక పాఠశాలస్థాపించిరి- తర్వాత అదివిశ్వభారతి అను పేరుతో గొప్పవిద్యాపీఠమయ్యెను- అదియిపుడు ప్రపంచఖ్యాతిగాంచియున్నది-

౧౯౧౨లో వారుగీతాంజలినిరచించిరి- మరుచటియేడుదానికై వారికినోబెల్ బహుమతి యివ్వబడెను- అపుడువారు ఇంగ్లాండుపోయి తనబెంగాలీయరచనలను కొన్నింటిని ఇంగ్లీషుభాషలోకి అనువదించిరి- వారుఅనేకపర్యాయములు యూరపుఖండానికిపోయి జపాను,రష్యా,చైనా, అమెరికా, పర్షియాకనడాలలో సంచారముచేసివచ్చిరి- ౧౯౩౦లో ఆక్స్‌ఫర్డులో హిబ్బర్టుఉపన్యాసములనిచ్చి గౌరవముపొందిరి-

౭౦ వఏట వారు చిత్రలేఖనముప్రారంభించిరి- వారిపటములు మాస్కో,బర్లిన్,మ్యూనిచ్,ప్యారిస్, బర్మింగ్‌హాం, న్యూయార్కులలో ప్రదర్శింపబడినవి-

వారు గేయములనుకూడ రచించగలవారు- ౩౦౦౦గేయములను రచించినారు-

ప్రభుత్వమువారువారికి ౧౯౧౫లో సర్ బిరుదమునిచ్చిరిగాని, టాగూరుగారు ప్రభుత్వమువారు దేశసేవకులవిషయంలో అనుసరించిన కఠినవిధానముపైకోపించి, దానిసంబంధమైనసనదును ప్రభుత్వమువారికి తిరిగియిచ్చివేసిరి- కలకత్తా,కాశీ, డక్కా-విద్యాపీఠములు "డి.లిట్"అను గౌరవబిరుదములను టాగూరుగారికిచ్చినవి-

ఒకసంవత్సరంక్రిందటనే ఆక్స్‌ఫర్డు విద్యాపీఠమువారుకూడతమగౌరవ "డి.లిట్" బిరుదమును టాగూరుగారికి సర్ మారిస్‌గ్వయర్ గారిద్వారా శాంతినికేతమునందే టాగూరుగారి కర్పింపజేసిరి-

ఇట్టిటాగూరుగారిమరణమిపుడుదేశములో చాలకొఱతను కలిగించినట్లు అందరును విచారపడుచున్నారు-

## చందాదారులకు మనవి

చందాదారులు మా కార్యాలయమునకు జాబులు వ్రాయునపుడు, మనియార్డర్లు బంపునపుడు, తమ చందానెంబరు వ్రాయుటయందు తగుశ్రద్ధగైకొనుటలేదు. చందా నెంబరు వ్రాయనిది వెంటనే జవాబీయుటకు వలనుపడదు. కాన చందాదారులెల్ల ముఖ్యముగ గమనింపకోరెదము.

మేనేజరు, గోలకొండపత్రిక

## దేవీ ప్రశ్న

అయిదుప్రశ్నలువ్రాసి కవరులోయుంచి సీలువేసి పంపిన దేవీమహిమచే ఫలితములువ్రాసి మీకే కవరుసహా పంపుటకు రు 1-6-0 సంవత్సరఫలం సెంబవారీ రు 1-12-0 దశలుగల పూరాజాతకం రు 5-8-0 శ్రీసరస్వతీజ్యోతిషాలయం,కాకినాడ.



## అబద్ధవార్తా నివారణ

రయ్యతుపత్రిక వార్తనుగురించి

౧ మొహరునాటి సుబేదక్కన్ పత్రికలో మొదటిపుటపై పెద్ద అక్షరాలతో ఈక్రిందివిధమైన శ్రీముఖము ప్రకటితమైయున్నది.

"౩౦ షెహరేవరు నాటి రయ్యత్ పత్రికలో బాబెహుకూమతు యొక్క కొత్త ఏర్పాట్లు" అనుశీర్షికలో వ్రాయబడిన విషయము కేవలము తప్పున్నూ మరియు గాలిమాటలుగానూ ఉన్నవి. వానిలో ఏమిన్ని యాథార్థ్యము లేదు. అయితే యింతమాత్రము సంభవమే ఏమనగా ఎప్పట్ల అవసరముగుకొ దానిని బట్టి ప్రతిశాఖావిషయమున అవసరమగు మార్పులు, ఎచ్చుతచ్చులు అగుచుండును. అవి ప్రపంచములో సాధారణముగా జరుగునవి కాన అందు ఆశ్చర్యజనకమగు విషయములేదు. అయినను ముందునుండి పత్రికలసంపాదకులు ఎంతవరకైతే విషయముల యాథార్థ్యమును పరిశీలించుకొనరో అంతవరకు అడ్డమువచ్చినఅల్లిబొల్లి ముచ్చట్లనువ్రాసి జనులకు తప్పుడుభావనలను కలిగించకుందురుగాక అట్టిముచ్చట్లు వ్రాయువారిపైననే బాధ్యత మోపబడును. కాలము మార్పుతోకూడినట్టిది. మరియు ప్రతివ్యవహారములోను ప్రభువున్నూ అతని ప్రభుత్వమున్నూ బాగా ఆలోచించి అడుగు వేయ వేయవలసియుండును.

పేషీదప్తరు (నజరీబాగు) వ్యవహారము ప్రత్యేకవిశిష్టతకలిగినట్టిది. పైవాటితో దానికి సంబంధములేదు.

రయ్యతు వ్రాత

పై శ్రీముఖమునకుగురియైన ౩౦ షహరేవరు నాటి రయ్యతువార్త యీవిధముగా నున్నది.

బాబెహుకూమతు మార్పులు

[ ప్రత్యేకవిలేఖరి]

కొన్నిదినాలనుండిబాబెహుకూమతులో మార్పు, లుజరుగువదంతులు చాలా ఉన్నవి.ఆందులో పది మంత్రులుందురట.వారివిసెము గాఏర్పాటగుదురట

మాల్ మంత్రి, అభివృద్ధిశాఖామంత్రి, నిర్మాణశాఖామంత్రి, శాంతిరక్షకమంత్రి, ఆరోగ్యమంత్రి, విద్యామంత్రి, ఫైనాన్సుమంత్రి, రాజ్యాంగమంత్రి వీరువరుసగా ఈవిధముగా ఉందురట. సర్ టాక్కర్ గారు, రాజా శ్యామరాజబహద్దరుగారు, అలీనవాబజంగుగారు, సయ్యిద్‌అబ్దులతీఫ్, రాజా ధర్మకరణ్, కమాల్‌యార్జంగుగారు, గులాంమహమ్మద్‌ఖాన్ (యూ.పీ.లో పబ్లియిశాఖాకార్యదర్శిగా ఉన్నవారు) మెహిదీయార్జంగుగారు ఏర్పాటగుదురట.

ప్రభువుగారిపేషీసదరుల్మహాంపైన న॥ఖుర్షీజ గుగారు ఏర్పాటగుదురట- బాబెహుకూమతు కార్యదర్శి న॥ మెహిదీనవాజజంగుగారుందురట.

## పురపాలకాధికారులకు విజ్ఞప్తి

(స్వ-వి) ౨౮-షహరేవరు ౧౦

గతశనివారం ఉదయం ౧౦ ఘంటలకుసఫాయిబల్దియామండి ౧౦ మంది మనుష్యులు చెంచల్‌గూడెమునకుపోయి అక్కడ నివసించువారితో తాము సర్కారుమనుష్యులమనియు, మీయిండ్ల కొల్తలుతీసికొనుటకు వచ్చితిమనియు చెప్పగావారు యీకొలతలెందులకనిప్రశ్నించిరి. అందుకిపోయినవారు తాము సర్కారుమనుష్యులమగుటచే మీకుకారణము చెప్పవలసినపనిలేదని జబర్దస్తీచేసి గృహములకొలతలుతీసుకొనిపోయిరి. ఆతర గృహయజమానులు, తమకేవిధమగు నోటీసియ్యకయే యిట్లు చేయతగదనియు వారము రోజు లముందుగ నోటీసు తమకుచేరినగాని కొలవనియ్యమనియు పట్టుపట్టిరి. ఆవచ్చినవారు మరునాడు తప్పకచెప్పి మరలిపోయిరి. తరువాత గృహయజమానులందరికి అని బల్దియావారికి పైవిషయమై వివరములు తెలుపవలసినదిగా నోటీసుఇచ్చినారు.

### సర్-బి-యల్-మిత్తర్

వీరు గోలకొండ సికరేటు మొకద్దమాలోవచ్చినారు. వీరు ౨౭ షహరేవరునాడు హ-ఘ-హ నిజాంప్రభువు గారినిదర్శించుకొనివిమాన్లాడినారు-

### జొహ్రామసీదు

ఈరజాసాహేబురాయిగారు హైదాబాదుకి౧౦౦౦౦ రూ చందాయిచ్చుకొన్నారు.

## అనావృష్టియొక్క ఘోరఫలితము

రైతులమొర కరీంనగరంజిల్లా

కరీంనగరుజిల్లా సిరిసిల్లతాలూకాలోని చీకోడు చెప్పాలపల్లి తామాపూరు ముచ్చర్ల గ్రామాల రైతులు కరీంనగరు తాలూకుదారుకు ఇచ్చుకున్న విజ్ఞప్తియొక్క నకలు మాకుపంపినారు. అందిట్లు మొరపెట్టుకున్నారు.

ఈసంవత్సరం వర్షాలులేక పంటలులేకపోయెను. వేసుకొన్నవిత్తనం నష్టమయ్యెను. మేతకరువైంది, దగ్గరిఅడవిలో సాగవాను చెట్లఆకులు పశువులమేతగాకోయదలచితిమి, కాని అడవిశాఖ చౌకిదార్లు మమ్ములబాధించుచున్నారు. మాపశువులు చావసిద్ధమైనవి. అవిచస్తే మేమున్నాచచ్చినట్లే. ఈవిషయం దయదలచి మాకుఅడవినుండి పశువులకు ఆకు మేతదొరికేటట్లుచేయగలరు"

... ... ...

ఇట్లే ఇతరచోట్లనుండియు అనావృష్టిచే కలుగుచున్న బాధలనుగూర్చిన మొఱలు మాకునుఇక్కడి ఆంధ్రమహాసభ స్థాయిసంఘకార్యాలయమునకును పంపబడుచున్నవి.

ఇల్లెందుతాలూకాలోని తిమ్మారావుపేటమున్నగు అన్నిగ్రామములలోను, ఖమ్మంమెట్టుతాలూకాలోను. షర్కీతాలూకాలోని ఘట్టుపల్లిమున్నగుగ్రామములలోను, మానుకోటతాలూకాలోని అన్నిగ్రామాలలోను మహబూబాబాదు తాలూకాలోని అన్నిగ్రామాలలోను,బాగాతుతాలూకాలోని సిర్వేలు జన్గామలలోను, కరీంనగరు తాలూకాలోని ఇరుకుల్లగ్రామములోను, సిరిసిల్లతాలూకాలోని విలాసపుందిలోను వర్షములులేక వేసినపైరులు ఎండిపోవుచున్నవి.పశువులకుమేతలేదు, నీరులేదు. ధరలుపెరుగుచున్నవి. పనివారలకు పనులులేకఅల్లాడుచున్నారు. ఈపరిస్థితులలో వారలకు ధాన్యముగాని, ధనముగాని సాహుకారులు ఋణమిచ్చుటలేదు.

షర్కీతాలూకాలోని వెలమకన్నె, కొండాపురము, తేరేటుపల్లి, ఘట్టుపల్లి మున్నగుగ్రామములలోను, మానుకోట తాలూకాలోనిగ్రామాలలోను, మహబూబాబాదు, ఖమ్మం తాలూకాలలోను త్రాగుటకు మంచినీరుకూడ చిక్కుటకష్టమైనది.

నాగరకర్నూలుతాలూకాలో గంగవరం మహాలాలో పశువులమేతకై ఆకు తెచ్చుకొనవచ్చుటకు అడవిశాఖాధికారు అనుమతించినట్లుచేసి, గతె౩గ ఫ— బాచరాయి మాఫీచేయించవలెననియు, వనపర్తిసంస్థానములో బుధవారంనుంచి ఖిజాకేపల్లివరకు రోడ్డువేయించి వ్యవసాయప్రజలకు పనికల్పించవలెననియు, ఈరోడ్డువేయుటకై పైమాయిషు ఇదివరకేచేసియున్నారనియు నాగరకర్నూలు తాలూకాలోని కాయినిపల్లినుండి మొఱవచ్చినది— మహబూబాబాదు తాలూకాలో ప్రజలకున్న అనుమానుపుచేసి, తినుబండారము అనిపించు ఏర్పాటుచేయవలెనని సూచనచేయబడినది— మహబూబునగరంజిల్లాలో అడవులుండు పశువులమేతకై అడవులలోనికి, ఆకులుతెచ్చుకొనుటకు రైతులుయత్నించుచుండ అడవిశాఖోద్యోగులు ఆటంకపరచుచున్నారు— సిర్వేలు, జన్గామలలో పశువులుకొన్ని మరణించుచున్నవి— ఇదేసమయములో ఇరుకుళ్ళగ్రామంలో గొర్రెలు మేకలు చిటుకరోగముతగిలి మరణించుచున్నవి. మహబూబాబాదు, ఖమ్మంతాలూకాలలోకూడ చీడపారులవల్ల చాలపశువులు ఇదేసమయంలో మరణించుచున్నవి.

మానుకోట ఖమ్మంతాలూకాలలో కలరాబాధఉన్నది. ఖమ్మంలోకలరావల్ల భయపడి చుట్టుప్రక్కలగ్రామాలనుండి పాలుపెరుగు కూరగాయలు అమ్మకొనుటకై అక్కడికివచ్చువారలుకూడా వచ్చుటలేదు. మానుకోట సంస్థానములో కలరావల్ల జననష్టముకూడఉన్నది—

## సంపూర్ణస్వాతంత్ర్యానికి తగ్గరాదు

గాంధిమహాత్ముని ప్రకటన

గాంధిమహాత్ముడు ఆగస్టు ౮ వతేదిన ఈక్రింది ప్రకటనగావించినారు:

"లుక్" అనే అమెరికా మాసపత్రిక ప్రతినిధితో నేనుచెప్పినవిషయములని ప్రకటించినదానిని పత్రికలలోనేనుచూచినాను— అది ఉత్తకల్పనాకథ— ఆపత్రిక పేరు నాకిదివరలోగాని ఇపుడుగాని తెలియదు— నాఅభిప్రాయము ఇదివరలో పలుమారులుచెప్పినట్లేయున్నది. సంపూర్ణస్వాతంత్ర్యముకంటె తక్కువఅయినదేదియు కాంగ్రెసును సంతృప్తిపరచజాలదు—



## సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ యిండియా లిమిటెడ్.

1946 సంవత్సరపు 3 o/o డిఫెన్సు బాండ్లు కొనువారికై సెంట్రల్ బ్యాంకువారి ప్రత్యేకస్కీము.

(1) సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా లిమిటెడ్‌వారు 1946 సంవత్సరపు 3o/o నున్న బాండ్లు ప్రకటింపబడినరేటుప్రకారము యిత్తురు.

(2) బాండ్లకొరకు దరఖాస్తుచేయువారు తాముబాండ్లుకోరిన మొత్తములో ప్రతిశతి 5 వంతు ముందుగా చెల్లింపవలయును. రు. 100 లకు అంతకుపైనగాని దరఖాస్తులు తీసికొనబడును.

(3) తరువాత బాండ్లమొత్తము యీక్రిందివిధముగా చెల్లింపవలయును. మొదటి మూడు నెలలవరకు ప్రతిశతి 5 గాని అంతకెక్కువగాని చెల్లింపవలయును, మిగతమొత్తము దరఖాస్తుచేసిన తేదినుండి రెండుసంవత్సరములలోగా కొన్న వాయిదాలను సారముచెల్లింపవలయును.

(4) బాండు విలువనుపూర్తిచేయుటకై చెల్లింపడిన కిస్తుమొత్తములపై బ్యాంకువారు నూటికి 2 1/2 వంతున వడ్డియిచ్చెదరు.

(5) పూర్తిమొత్తముచెల్లించిన తరువాత బాండ్లుయివ్వబడును.

(6) బాండుమొత్తముపూర్తిగా చెల్లించినతరువాత ప్రతిశతి 2 1/2 వడ్డిలెక్కపోయి, బాండు యివ్వబడినతేదినుండి సరియైనవడ్డి చెల్లింపబడును

(7) బాండుయొక్క పూర్తిమొత్తమును చెల్లించకముందే అవుసరమువచ్చినయెడల బ్యాంకువారు దానిని మార్కెటురేటుప్రకారము ఏమియుకమీషను లేకుండకొనుచు, దానిపైయింకా చెల్లించవలసినశేషమును పట్టుకొని మిగతపైకమునిత్తురు.

హైదరాబాదు—దక్కను } మేనేజరు.

28—8—40 } కె. జె., వికాజీ

సంవత్సరము చందా
౬ హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
3 రూపాయిలు
బ్రిటిషిండియాకు
సం॥చందా
౫-౮-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only
Popular paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

Volume 16 . Hyderabad-Dn Monday 11th August 1941 Number 29


## సర్ అక్బర్ హైదరీ

## గొప్ప దేశభక్తుడు. రాజనీతిజ్ఞుడు

### నరేంద్రమండలి అధ్యక్షుని ప్రశంస

బొంబాయి, ఆగస్టు౮:

హైదరాబాదు మంత్రివర్గముయొక్క అధ్యక్షుడు సర్ అక్బర్ హైదరీగారు వైస్రాయిగారి కార్యనిర్వాహకవర్గ సభ్యత్వమును స్వీకరింపబోవుచుండుటచే, నరేంద్రమండలివారు వారికివిందుచేసిరి-ఈవిందులో నరేంద్రమండలి అధ్యక్షుడగు ధ్రువపదవహించిన జామ్ సాహెబుగారు సర్ అక్బర్ హైదరీగారి దేశభక్తిని రాజనీతినిపుణతను ప్రశంసించిరి. సర్ అక్బర్ గారివంటి ప్రముఖుడు వైస్రాయి కార్యనిర్వాహకవర్గంలో నుండుటవల్లను దేశరక్షణజాతీయసంఘంలో ప్రముఖులు చేరుటచేను, రాష్ట్రప్రతినిధులు సంస్థాన ప్రతినిధులు ఒక్కచోటచేరి ముఖ్యసమస్యలను విచారించుటవల్లను దేశముయొక్క యుద్ధప్రయత్న మినుమడించి గ్రేటబ్రిటనుకు సాఫల్యమొసంగుటకు అవకాశము కలుగుగాకయని జంసాహెబ్ గారు చెప్పిరి.

సర్ అక్బర్ గారు గొప్పసంస్థానమునకు ప్రధానిమాత్రమె యైయుండలేదు. సంస్థానములప్రధానులందరికిని ముఖ్యులుగానుండిరి. ప్రస్తుతస్థితిగతులలో భారతసంస్థానములన్నియు కలిసియుండవలెనని దూరదృష్టితో యోహించినవారిలో ప్రధములు సర్ అక్బర్ హైదరిగారే. చిన్న సంస్థానములను పెద్దసంస్థానములకు కలయికకలిగించి నరేంద్రమండలికి బలముచేకూర్చినవారు గూడ సర్ అక్బర్ హైదరిగారే. సర్ అక్బర్ హైదరీ, బికనీర్ మహారాజా, చిన్న పెద్దసంస్థానముల ప్రభువులు, మంత్రులుకలసి పనిచేయుట వలన నరేంద్రమండలి ప్రస్తుతస్థితియందుండెనని చెప్పిరి.

సర్ అక్బర్ హైదరిగారి దేశభక్తి, రాజనీతి వారిసంస్థానపుసరిహద్దులను దాటిపోయెను- సంస్థానముల స్వాతంత్ర్యమును, సర్వాధికారమును సంధివాక్కులను గ్యారంటీచేయుచో సంస్థానములు భారతదేశక్షేమాభివృద్ధిలో పాల్గొనవలెనని సర్ అక్బరుగారు తలచిరి-ఈఆశయమును మనసులోనుంచుకొని వారు రౌండుటేబిలుసభలోను జాయింటు పార్లమెంటుకమిటీలోను పనిచేసిరి-సంస్థానములు తమప్రత్యేకత్వమును నిలుపుకొనుచు, భారతదేశవిజ్ఞానాభివృద్ధికి తోడ్పడదగియున్నవని సర్ అక్బర్ గారునమ్మిరి. సంస్థానములు తమస్వాతంత్ర్యము, సర్వాధికారము నిల్పుకొనుచు, భారతదేశ ఫెడరేషనుస్థాపనమునకు తోడ్పడవలెనని సర్ అక్బర్ హైదరీగారు ప్రతిఉపన్యాసములోను చెప్పుచుండిరి. ముందుస్థాపింపసంకల్పించుచున్న ఫెడరేషనులో సంస్థానములు విచ్ఛిన్నముకాకుండ తగినజాగ్రత్తపడవలెనని వారుచెప్పుచుండిరి-సంస్థానములవారు తమవైఖరిని మార్చుకొనిరని కొందరులక్షేపింపగా "మారినది మేముకాదు. పెండదటిఆభిప్రాయములను మార్చుకొని, మేము వెనుకతో సంచరించునట్లుచేసినది మీరు" అని వారు నిష్కపటముగాచెప్పిరి- అని జామ్ సాహెబుగారు చెప్పిరి.

సంస్థానములలో హైదరాబాదు యొక్క ప్రాముఖ్యము, సంస్థానాధిపతులకు సర్ అక్బరు హైదరీగారుచేసినసేవ జంసాహెబుగారుగ్గడించిరి-నరేంద్రమండలికి అన్నివిధముల తోడ్పడుటకు నిజాముప్రభువుగారు గత మాసముననే వాగ్దానముచేసియుండిరని చెప్పి మరియునిట్లనిరి:-

"మీరు వైస్రాయికార్యవర్గమునకు అలంకారభూతులే-కాని మీరుమీవ్యక్తిపరముగా తత్సంఘములో నియమింపబడితిరి. సంస్థానములపక్షమునగాదు-ఈవిషయమును నేను స్పష్టముచేయవలసియున్నది-

### సంస్థానముల పరిపాలన

సంస్థానములయందలిపరిపాలనము యిదివరకుకంటె చాలఅభివృద్ధియయ్యెననువిషయము మనకువలెనే సర్ అక్బరు హైదరిగారికిగూడ సంతసముకలిగించును- సంస్థానములలో శాసనరీత్యా పరిపాలనజరుగుచున్నది- అదిగాక ప్రజాక్షేమకరమగుపనులు, సంస్కరణములుగూడ ప్రవేశపెట్టబడినవి-మరియుదేశీయులకు తగిన క్రమరాజ్యాంగాభివృద్ధినికలిగింప సంస్థానాధిపతులు కృతనిశ్చయులైయున్నారు- మరియుయుద్ధములో విజయము కలుగుటకై తమసర్వస్వము నర్పింపదలచియున్నారు విధితమే, సర్ అక్బరుగారు మంత్రులసంఘాధ్యక్షతను విరమించుచున్నారు- వారిస్థానము సర్ వి-టి-కృష్ణమాచారిగారికి సంక్రమించుచుండుట సంతృప్తి కలుగజేయుచున్నది.

### బికనీరు మహారాజాగారి తంతి

సర్ అక్బరుహైదరీగౌరవార్థమై జరుగుచున్న విందుకు తానురాజాలననియు విందు జయప్రదముగా జరుగుగాకయని బికనీరుమహారాజా తంతివార్త నొసంగిరి.

జామ్ సాహెబు మహారాజాగారు సర్ అక్బర్ హైదరీగారిని ప్రశంసించుచు గావించినఉపన్యాసమునకు సర్ అక్బర్ గారు ఈక్రిందివిధముగా ప్రత్యుత్తరమొసంగిరి:-

వైస్రాయి కార్యనిర్వాహకవర్గములో నేను హైదరాబాదు సంస్థానప్రతినిధిగా నియమింపబడలేదనియు, వ్యక్తిపరముగా నియమింపబడితిననియు మీరుచెప్పినమాటనిజము. వైస్రాయికార్యనిర్వాహకవర్గ విస్తరణసూచన మొదటగావింపబడినప్పుడు, ప్రస్తుతరాజ్యాంగవిధానముననుసరించి సదరువర్గము ఒక్క బ్రిటీషుఇండియాకు సంబంధించినదనియు, దానిలో సంస్థానములకు ప్రాతినిధ్యముండరాదనియు హైదరాబాదు పక్షమున నేనుచెప్పియుండినవిషయము జంసాహెబుగారికి తెలిసియేయున్నది. దేశరక్షణ జాతీయసంఘములో సంస్థానములకుప్రాతినిధ్యముండవలెననియు, ఇట్టిప్రాతినిధ్యమువలన సంస్థానములకు బ్రిటీషు ఇండియాకు సన్నిహితత్వ మేర్పడుననియు నేను చెప్పితిని- ఈవిషయమై జంసాహెబు స్పష్టముగాచెప్పినందుకు కృతజ్ఞుడను- క్రొత్తఉద్యోగములో నేను క్రొత్తబాధ్యతలను నిర్వహింపవలసియుండుటచే మునుసంస్థానములు చేయవలసినదానివిషయమై యెక్కువగాచెప్పను.

వినను యిదివరలో సంస్థానములవారు చేయుచుండిన సంప్రదింపులు, సమాలోచనలవిషయమై కొంతచెప్పగలను- కొన్నాళ్ళనుండియు చిన్న పెద్దవిభేదములులేకుండ సంస్థానములు సంప్రదింపులు, సమాలోచనలు జరుపుచుండెను- ఆసభలలోకలిగినఅనుభవము వైస్రాయికార్యవర్గసభలో నాకుసహాయకరముగానుండుననుట నిశ్చయము.

### ఇండియా భవిష్యత్తు-సంస్థానములు

భారతజాతీయ జీవనములో చేరియున్నప్రధానవర్గములనగా ఒక్క రాజకీయ పక్షాలుమాత్రమే కావనియు, సంస్థానములుగూడననియు నిటీవల పార్లమెంటులో అమెరీగారుచెప్పినమాటలు మనకు చాలసంతసముకలిగించుచున్నవి, జరుగుచున్నవివాదములలో సంస్థానముల ప్రాధాన్యము, అస్తిత్వముపైతము మరువబడుచున్నది. ఈకారణముచేత, భావిభారత రాజ్యాంగవిధాన నిర్మాణమునందు భారతసంస్థానముల అంగీకారమవసరమని అమెరీగారుచెప్పినమాటలు సంతోషముకలిగించుచున్నవి మనముప్రయత్నములుచేసియుండుటచేత మీతోడ్పాటుపొందిన మీమంత్రులసంఘమువారు బాగుగాప్రయత్నములుగావించియుండుటచేత భావిభారతరాజ్యాంగ విధాననిర్మాణమునకుసంస్థానముల ఆమోదము, అంగీకారము అవసరమనువిషయము మరలయిప్పుడు స్పష్టముగ,నిశ్చయముగా ధ్రువపరుపబడినవి ఈమంత్రుల సంఘమునకు అధ్యక్షుడనైయుండిన నాకు మఖ్బుల్ మహమ్మద్ క్రిందనున్న కార్యాలయము, హైదరాబాదులో నవాబుఅలీయార్జంగు బహద్దర్ గారి క్రిందనున్న కార్యాలయములుబాగుగా తోడ్పడినందుకు నేనుయిందుమూలకముగా కృతజ్ఞత దెలుపుచున్నాను

భావిరాజ్యాంగ చర్చలకు సమయమువచ్చినప్పుడు భారతదేశాభివృద్ధికి సంస్థానములుతగినట్లుగాతోడ్పడునని నేనునమ్ముచున్నాను. మనఅందరిమాతయగు భారతదేశమునకు సంస్థానాధిపతులు భక్తితోసేవజేసిరనుట నిశ్చయము

మిమ్ములను వదలివెళ్లుటకు చాలచింతబొడముచున్నది. వినను, యిన్నాళ్ళనుండియు మనముకలిసిపనిచేసితిమను సంతృప్తి, మీరునన్ను ఆశీర్వదించిపంపుచున్నారను భావము నాకుకలదు నేను హైదరాబాదు సంస్థానములో ౩౯ సంవత్సరములుసేవచేసితిని. నిజాంగారు నాపైనమ్మకముంచి సంస్థానములోగల ఉద్యోగములన్నిటిలోను పెద్దఉద్యోగమిచ్చెను అచ్చటగూడ విశ్వాసముతో, భక్తితో, నాశక్తికొలదిసేవచేసితినని సంతృప్తినాకుకలదు. సేవముగించుటకు పూర్వము మంత్రుల సంఘాధ్యక్షునుగానుండుటకు సర్. వి. టి. కృష్ణమాచారిగారిని హృదయపూర్వకముగా నాహ్వానించుచున్నాను, ఆచారిగారి అనుభవము, వివేచనాశక్తి, సరసత్వము, నైపుణ్యము మీసేవయందు వినియోగపడును."

### సర్ జఫరుల్లాఖానుగారు

బ్రిటిషిండియా పప్లయమంత్రిగానైన సర్ మహమ్మద్ జఫరుల్లాఖానుగారు గతవారము హైద్రాబాదుకు విచ్చేసిరి. వారు జనాబ్ జిన్నాగారితో మాట్లాడిరి. ప్రధానమంత్రి సర్ అక్బరుగారితో మాట్లాడిరి. నగరములోయుద్ధముకై పరికరము సిద్ధముచేయుయంత్రాలయాలలో పరీక్షించిరి. ౩౦౯మారేవరువాడు మ.ఘ.వ. నిజాంప్రభువుగారితో కలసి మాట్లాడిరి.

### శ్రీనిజాంరాష్ట్ర యాదవయువజన సంఘము

(హైద్రాబాదు)

౧౫,౧౬,౧౭,అగస్టు౧౯౪౧, శుక్రవారం: శనివారం, ఆదివారములలో హైద్రాబాదులో రాజాప్రతాపగిరిజీగారి బంగళాయందు శ్రీకృష్ణజన్మాష్టమి మరియుయాదవయువజనసంఘ ద్వితీయవార్షికోత్సవము శ్రీయుత ఎం- గోవింద రాజాయాదవ బి.ఏ.గారి అధ్యక్షతక్రింద యీదిగువవివరింపబడు కార్యక్రమము జరుపబడును.

శుక్రవారంఉదయము ౯-౧౧హవనము, యజ్ఞోపవీతధారణ, రాత్రి౯గం॥భజన.

శనివారం పగలు౧-౨-౫వరకు పశుప్రదర్శనము, ౭టం.ల. రాత్రి౯గం॥భజన, ఎన్నికలు.

ఆదివారం రాత్రి ౯ గం॥ ఉంజలి. వినోదములు-

# గోలకొండ డైరీ

౧౩౫౧ఫ.

౬,౦౦ ప్రతులు ఈ ౧౦ దినములలో అమ్మకమైనవి.

★ ★ ★

ఒక నెలలో అన్నీ ఆయిపోవచ్చును.

మళ్లీ నిరాశ అగును.

పేజిలు-క్యాలికో ౧౪ అణాలు.
సగంచర్మం ౧-౮-౦ పూర్తిచర్మం ౨-౨-౦
చర్మంమీద పేరుఅక్షరాలకు అణాలెక్కువ. సైండుకాని డైరీ ౧౨ అణాలు,

▣ ▣ ▣ ▣

- కాగిదాలధర రెండంతలు పెరిగింది.
- డైరీ చాలాపెరిగింది.
- వెలమాత్రం పెరుగలేదు!!

### అదాలత్ దివానీబల్దాయిబ్రైదాయినేగా మూడవ నాజిం

నవాబు వాజద్ హుసేన్ ఖాన్ సాహెబు గారినమక్షమునుండి

దావా రు: 2022 లు.

బనాం' నరసింహారావు వల్దు రాంచందర్ రావు అసల్ దారు పట్వారి హిందూ 25 సంవత్సరములు వృత్తి పట్వారి సాకిన్ తిబాలపల్లి తాలూకా అంబరుపేట ఇలాక సరఫ్ఖాసు ముకాంకు రాంచందర్ రావు ఇంటిలో

ఎందుమూలమున తెలియజేయుట ఏమనగా నీపేర ఎన్నిరోజూమారులు సమనుజారీచేయబడెను కాని నీవుతప్పించుకొంటివి అందునుంచిఅవి అమలుకాక తిరిగివచ్చినవి కావున ఇందుమూలమున తెలియజేయుటఏమనగా నీవు ౨౫ మెహర్ ౧౩౫౦ ఫసలీ ఆదివారము ౧౦ గంటలకు వకీలు యుక్తముగా ఆదాలతుకువచ్చి పైరవిలో హాజరివుండవలెను, ఒకవేళ గైరుహాజరైన బాజాబితా కార్యాయిచేయబడును తర్వాత ఎట్టిపుజులు చెల్లనేరవు.

౨౮ షహరేవరు ౧౩౫౦ ఫసలీ నాసంతకమున అదాలతు మొహరుతో వెడలినది.

దస్తకతు,
సిరిస్తేదారు.

## పంచోలి ఆర్టు పిక్చర్సు

ఖజాన్చి

8 వ వారము

అత్యుత్తమ చిత్రము

ప్రతిభాశాలురగు ఇస్మాయిలు మనోరమ, దుర్గా, జానకీదాస్, రమోలా మున్నగువారు ఆరితేరిన నటీనటులు ఇందుపాల్గొనిరి. పండితపామరహృదయాలను ఆకర్షించి ఉయ్యాలలూగించే మధుర గానాలు, కాలప్రవాహాన్ని కనిపెట్టనివ్వని కడుమన్నితమయిన హాస్యము, చూచినవెంటనే సౌందర్యానుభవమునుకలిగించు ప్రకృతిదృశ్యాలు దర్శకత్వంలో అతిరథ మహారథులయిన దర్శకశేఖరుల సిద్ధహస్తాలలో మెలగటము—ఇవీ యీచిత్రము కాలూనుగొప్పదనాలు.

అందమాచూడాలి, ఆనందించాలి, ఒకమారుచూస్తే రెండవమారు చెప్పనక్కరలేదు.

# నిషాత్ సినిమా

(పూర్వపు సెక్రటలు)

## మ. ఘ. వ. నిజాంస్టేట్ రైల్వే.

భోజనవసతుల ఏర్పాటుగుత్త.

హిందూ మరయు ముస్లిముల భోజనవసతుల ఏర్పాటుగుత్తలకు ఈరైల్వేలో నెం 3 సెక్షన్ అను మొరంగపల్లినుండి పర్లీ వైద్యనాథ్ మరియు పర్భానిమీదుగా అంకై వరకు 1941 సం॥ 1వ అక్టోబరునుండి 6 నెలలవరకు మాత్రమే టెండర్ దరఖాస్తులు కావలెను. కనీసపు టెండరుఫీజు, టెండరు దరఖాస్తులు మొదలగువాటికొరకు ఈక్రింద సంతకముచేసినవారికి హాలీ రూ 1-0-0 ఒకొక్కఫారమునకు పంపవలెను. ఈఫీజు మరలతిరిగి ఇవ్వబడదు.

టెండరులు 30వ ఆగస్టు 1941వరకు తీసికొనబడును. సఫలకంట్రాక్టుదారుడు 1వ అక్టోబరు 1941 తేదీనుండి పనిఅంతయు మొదలుపెట్టుటకు సంసిద్ధుడైయుండవలెను.

చీఫ్ కమర్షియల్ మేనేజరు ఆఫీసు
సికింద్రాబాదు ఆగస్టు 6-1941

ఎ. జె. ప్రింగిల్,
ఆక్టింగ్ ఛీఫ్ కమర్షియల్ మేనేజరు.


Printed and Published by, G Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn, Editor- S Prathapa Reddy B.A.B.L